ప్రకృతి గ్రంథమాల.

# ప్రాకృత చికిత్సార్ణవము

4 వ భాగము

( వివిధవ్యాధులకు చికిత్స లిందుగలవు )





ప్రకాశకులు :

ప్రకృతికార్యాలయము, బెజవాడ.

బెజవాడ :

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1933



వెల ఇతరులకు 0-6-0

చందాదారులకు 0-5-0

# ప్రాకృత చికిత్సార్ణవము.

## నాల్గవ భాగము.

[ఏయేగ్రామములలో, ఎవరెవరు, ఏయేవ్యాధులను, ఏయేచికిత్సల వలన కుదుర్చుకొనిరో ఆ వివరము లిందు గలవు.]

ప్రకృతి పత్రికకు సం॥ చందా 3-0-0.

1-0-0 కు తక్కువ వెలగల గ్రంథములు వి. పి. గా పంపబడవు.

వలయువారు గ్రంథము వెల, పోస్టుఖర్చులు, పోస్టేజి బిళ్లలుగా పంపవలసియుండును.

గ్రంథముల జాబితా ఉచితము.

"ప్రకృతి" చందాదారులకు గ్రంథములు తక్కువధరలకు లభించును.

ప్రకాశకులు:

ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

1933.



ఇతరులకు 0-6-0

ప్రకృతి చందాదారులకు 0-5-0

# విషయ సూచిక







# ప్రాకృతచికిత్సార్ణవము.

## 4 వ భాగము.

### విషజ్వరము - (ENTERIC FEVER)

(డా॥ మన్నూరి రామకృష్ణరావుగారు. రాజమండ్రి.)

మద్దాల గుర్నాథరావుగారి శిశువు. వయస్సు **11** నెలలు. **105** డి॥ జ్వరము. ఎడతెగకనుండుట, విరేచనము కాక పోవుట, కడుపుపొంగుట. హోమొపతి మందులు వేయగా, కొంచెము విరేచనమగుట, మరల యథాప్రకారముగా కడుపు పొంగుట, అమితమైన కడుపునొప్పి, బాధకోర్వలేక గిలగిల కొట్టుకొనుట, మున్నగు రోగలక్షణములచే పీడితమగు చుండెను. మందులు వాడిన కొలదిని బాధ తగ్గక పోవుటయే గాక క్రమముగా హెచ్చుచుండును. తొట్టిస్నానములు చేయుటకు ప్రయత్నించిరి గాని చలినీరు పొత్తికడుపుపై పోయుటకు ప్రారంభించగనే శిశువు గిలగిల కొట్టుకొనుచు పోరుపెట్టి యేడ్చుచుండెను. ఏమిచేయుటకు తోచక శిశువును రాజమండ్రికి తీసికొనివచ్చిరి. రైలులోనే శిశువుయొక్క శరీరము చల్లపడిపోయెను. మొదటి 2 రోజులును 4, 5 స్నానములు చేయించుచు అప్పుడప్పుడు మట్టి పట్టీలు వేయించుచుంటిని. ఎనిమాలు చేయించితిమి. నీలిమందు వర్ణోదకము నిచ్చుచుం

టిమి. ఒక డిగ్రీ, అరడిగ్రి మాత్రమే తగ్గుచుండెను. 106 డిగ్రీలవరకు జ్వరము హెచ్చెను. రాజమండ్రిలోనున్న సుప్రసిద్ధులగు ఆంగ్ల, ఆయుర్వేద, యునాని, హోమోపతిడాక్టర్లు చాలమంది పరీక్షించిరి. ఇది ఇంటెరిక్ ఫీవరు అనియు టైఫాయిడు, న్యూమోనియా యివి రెండును కలిసి యున్నవనియు శ్వాసకోశములలో శ్లేష్మ మధికముగా కలదనియు Enlarlgement of liver కూడా ఉన్నదనియు ననిరి.

I will be surprised if you can get the temperature down in 3 days. I am sure it will run for over a week. In my long experience I found such cases as these coming down during the 2nd or 3rd week. I distinctly remember a case which came down during the 3rd week but again there was a relapse in the 4th week. I am surprised to see the child in this healthy condition ofter 12 days in spite of such fever and other conditions మూడు రోజులరో నీయుష్ణోగ్రతను తగ్గింపగలిగిన యెడల నిది మిగుల నాశ్చర్యజనకమైనదే యగును. ఈ జ్వరమిక వారమువరకు నిటులె యుండునని నానమ్మకము నా చిరకాలానుభవమున నిట్టి రోగములు 2, 3 వారములకు గాని తగ్గనటుల కనుగొంటిని. ఒకరోగికి 3 వ వారమున తగ్గి మరల 4 వ వారమున హెచ్చినటుల నాకు బాగుగ జ్ఞాపకమున్నది. 12 రోజులనుండి నిట్టి జ్వరాది లక్షణములు గల్గియు నీ శిశువిట్టి యారోగ్యదశయందుండుట జూడ నాకు మిగుల చిత్రముగ నున్నది." అని గవర్నమెంటు డాక్టరుగారనిరి. స్నానములు చేయించుట మిగుల కష్టముగ నుండుటవలనను, జ్వరము బాగుగా తగ్గకుండుట వలనను, బాధ యధికముగ నుం

డుట వలనను, స్నానములు మాని 3 వ నాటిరాత్రినుండి గంట కొక మట్టికట్టు చొప్పున వేయగా (అనగా అరగంట కట్టు, అరగంట విశ్రాంతి) తెల్లవారుఝామున 3 గంటలకు నిదురబట్టెను. మరల 11 గంటలకు మేల్కాంచెను. చికిత్స చేయుచునే యుంటిమి. శిశువు బాధలనుండి విముక్తుడై చక్కగా నాడుకొనమొదలిడెను. పాఠకా! వైద్యవరేణ్యులను సయితము కలవరమున ముంచిన రోగము సామాన్యమైన మట్టిపట్టీలవలన నెటుల నివారణమయ్యెనో చూచితివా? ఇంకనైనను సహజచికిత్స యెడల నీకు విశ్వాసము జనింపదా?

# మందులు-మహనీయుని యభిప్రాయము.

(రాఘవదాసుగారు, రాజయోగాశ్రమము, మునులతోట.)

ఆయన కాయనయే సాటియని జెప్పుకొన వలసినట్టి మహాసిద్ధ పురుషుడగు శ్రీ శ్రీ శ్రీ వివేకానందస్వామి "ప్రాకృశ్చిమము" లను శీర్షికతో వ్రాసిన వ్యాసమందు, మందులగూర్చి తన యభిప్రాయ మీ దిగున విధమున నుడివినాడు. వ్యాధుల నివారణార్థ మాహారవిషయమై మాత్రి మెక్కువ జాగరూకతతో నుండుము. వీలైనంతవరకు బయటిగాలి పీల్చుచుండవలయును. దూరముగా షికారు పోవుచు దేహమునకు పరిశ్రమ మీయవలయును. కాలి కండలు యినుమువలె దృఢముగా నుండవలయును. నీవు కొలువులో నున్న యెడల, వీలున్నచో, సెలవు పుచ్చుకొని హిమవత్పర్వతమందలి బదరికాశ్రమమునకు తీర్థయాత్ర పొమ్ము.

కొండ లెక్కుచు దిగుచు, ఆ రెండువందల మైళ్ళ ప్రయాణము పాదచారివై నీవు చేసినయెడల వ్యాధులన్నియు నిన్ను వదలి యావలికి బాఱిపోవును. ధన్వంతరులను (వైద్యులను) దగ్గఱకు రానీయకుము. వారివలన నీకు గలుగు మేలుకంటె కీడెక్కువ. ఔషధములు పుచ్చుకొనుటమానుము. అవి తఱచుగా రోగముకంటె ముందు రోగిని చంపివేయును. ప్రతి సంవత్సరము దుర్గాపూజకై సెలవు లిచ్చినప్పుడు చేతనైన చో పట్టణమునుండి నీ స్వగ్రామమునకు అంత దూరము నడచివెళ్ళుము. మన దేశములో ఏమి పాపమోకాని ధనవంతులు పరమమాంద్య పరతంత్రతా మూర్తులుగా బరిగణింపదగియున్నారు. ఒకరిచే అన్నముతినిపించుకొను వాడును నడచుట కొకరి యూత కావలయునను వాడును వ్యాధిగ్రస్థుడై దురవస్థలో బడకమానడు. రొట్టెయంతయు పడదేమో యని భయపడుచు పై పెచ్చు తినువాడు బ్రతికి యున్నను మృతప్రాయుడే! ఒక్క బిగిని 20 మైళ్ళ దూరము నడవలేనివాడు పురుషుడా పురుగా? బుద్ధిపూర్వకముగా అనారోగ్యమును, అకాలమరణమును ఆహ్వానముచేసి రప్పించుకొనువాని నెవడు రక్షింపగలడు? మందులకు దూరమునుండి నాలుగుమైళ్ళ దూరము నడువుడు. అని యుపదేశింప వలయునను మాట, యేమి పాపమోకాని! వైద్యుల బుఱ్ఱలకెప్పుడును తట్టదాయెను."

---

☞ మందులు, ఇంజక్షను, టీకాలు మున్నగు వానివలన గలుగు దుష్ఫలితముల నెఱుంగగోరువారు "ఔషధవైద్యమొక యూహాశాస్త్రము" "టీకాలువేయనగునా" అను గ్రంథములను జదువుడు.

# దంతశూల - ఆసనగండమాల

(డా॥ లక్ష్మీశెట్టి పట్టెయ్యాశర్మగారు, అమలాపురం)

దంతశూల (పిప్పిపళ్లు) ఆసనగండమాల, మలబద్ధము, మూత్రములో కలిసి తెల్లగాపడుట, నిద్రపట్టకపోవుట, మానసికవ్యాధి, సభాకంపము, దుస్స్వప్నములు, స్వప్నములో యొకరు కనిపించి పీకెనొక్కగా లేవబోతే కాళ్లుచేతులు కదుపుటకు వీలులేని అశక్తతగలిగియుండుట, జ్ఞాపకశక్తి నశించుట, పుస్తకముచదివిన 15 ని॥లకే తలవేడెక్కి చదువలేకపోవుట, నడచుట యనిన బద్ధకము, అప్పుడప్పుడు తలనొప్పి.

నాకు 1900 సం॥ రముకు పూర్వము దంతశూల, అసనగండమాలగాక పై నుదహరించిన వ్యాధులన్నియు 1895, 1896 లకే అంకురించినవి. 1900 సం॥రంనాటికి దంతశూల వ్యాధి ప్రారంభమైనది. 1913 వరకు దంతశూలను గూర్చి నానావిధ చికిత్సలుచేసితిని. నేటివుచికిత్సలు, పురుగులు తీయుట, చట్టుతీయించుట, అనేక వనమూలికాది చికిత్సలు, ఇంగ్లీషు అరఖులు వగైరాలు దంతగుల్లలో పెట్టుట, మొదలగు నెన్నియో చికిత్సలు యెవరేమిచెప్పితే యదిచేసి ప్రాణము విసికినవాడనైతిని. ఇది యిట్లుండ 1909 సంవత్సరమునందు కొత్తపేట గ్రామమందు ఎల్లోపతి డాక్టరుగా నియమింపబడిన శ్రీ సజ్జా సూర్యనారాయణరావుగారు మైత్రి కాగా, వారు దంతములనిమిత్తం చికిత్సచేయగా కుదరనందున దంతములు (పిప్పిపళ్లు) ఊడబెరకెదననిరి. అందుకు నే నియ్యకొననైతిని. అంత వారు నాఆరోగ్యమునుగూర్చి కొన్ని

ఇంగ్లీషు అరఖులు తెప్పించి యివ్వగా అసనగండమాలవ్యాధి కనుపించినది. అపు డా మందేమని విచారింపగా ఛీఫ్ అందు ఐరన్ వైన్ అనిచెప్పిరి. అంత ఆమందు విరమించి అవస్థలు పడుచునేయుంటిని. తుదకు 1913 సం॥రం జనవరినెలనాటికి నా ప్రథమకుమార్తెకు 18 మాసముల వయస్సు. చాలబలమైనదియు, అతిసుందరాకృతియు ఆరోగ్యవతియునగు నా కుమార్తె కపుడు జ్వరం, శ్లేష్మం, విదాహం, మొదలగు బాధ లంకురింపగా, నేటివువైద్యుల సేవచేయించితిని. సుఖంగాయున్నది. పత్యంపెట్టితిమి. ఆమరునాడు రాత్రి గం 8 లకు అకస్మాత్తుగా వాతపురివచ్చినది. (బాలబాపచిన్నె) ఇందులకు చికిత్స పొగచుట్టతో నోసటిపై కాల్చుట, కర్పూరం వగైరాలు వేయుట జరుపగా, తెల్లవారుసరికి మృత్యువాతబడినది. అంత కొన్నాళ్లకు అనగా 1913 సందే ఆగష్టు నెలలో కొన్ని వ్యవహారవిషయములగూర్చి మదరాసు పయనమైపోయితిని. అపుడు కూడ పై వ్యాధిగ్రస్తుడనగుచునే పోయితిని. అచ్చట డాక్టర్లకు దంతములు చూపగా ఊడబెరికినగాని బాధ నివారణకాదని సలహా నిచ్చిరి. పండ్లూడబెరుకుటకు నే నిదివరలో వలెనే యిప్పుడును సమ్మతింపనైతిని. పనులు ముగియగనే ఇంటికి పయనమై వచ్చితిని. ఇదివరలో 4, 5 సంవత్సరములకు పూర్వము నేను అభినవవైద్యశాస్త్రము చూచితిని. కాని అద్దానియం దంత శ్రద్ధవహించి యుండలేదు. 1910 సంవత్సరం లగాయతు నేను మా అత్తవారింట అంబాజీపేటలోనే యుంటిని. అంత నా కత్యంత మిత్రులును

సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులును, నగు శ్రీ బిళ్ల రామలింగముగారు తాము శిరస్సు పోటుచే పీడింపబడుచు, నానా విధౌషధ సేవచేసి ఎంతమాత్రము గుణము గానక అప్పటికి 7, 8 సంవత్సరముల క్రితమే తాము కూనె జలచికిత్సనాచరించి పరిపూర్ణ ఆరోగ్యము పొందినటులను, నన్ను కూడ జల చికిత్స ఆచరింపుమని హెచ్చరించగా, ఆయనవద్దనున్న అభినవ వైద్యశాస్త్ర మొకసారి గైకొని. ఆమూలాగ్రముగ పఠించి ఆ వెంటనే జలచికిత్సాచరించితిని. 1అభినవ వైద్య శాస్త్రము, 2. ముఖవైఖరీవిద్య. 3. రోగారోగ్య వివేకము, 4. శిశు సంరక్షణ, గ్రంథములు తెప్పించి ఆమూలాగ్రముగా చదువుచూ 10 మాసములు యీ కూనేజలచికిత్సాచరించుసరికి పై వ్యాధు లన్నియు పటాపంచ లైనవి. సుమారు ఇప్పటికి ఇరువది సంవత్సరములు కావచ్చినది. మరల దంతవ్యాధి బాధ లెన్నడును కలుగలేదు. ఎంతసేపు నిలువబడినను కాళ్లు నొప్పులుండవు, ఇదంతేయు కూనేజలచికిత్సా మహోప కారమే!

## చికిత్స విధానము.

ఉదయం 5 గంటలకు 20 ని॥లు కటిస్నానం, అటు పిమ్మట నూతివద్ద ఒక అరగంటకు శిరస్నానము. వెంటనే ప్లాసలుకోటు వేసుకొని 4, 5 మైళ్లు నడచుట, పిమ్మట 10 గంటలకు ఆహారం. వరిఅన్నము, సమస్తకాయకూరల కొంచెం ఉప్పుకారంతో గేదె నేతిపోపుతో భోజనం. మరల గం 12 1 గంల మధ్య 30 ని॥లు లింగస్నానం. మరల 4, 5 గంటల

మధ్య 30 ని॥లు లింగస్నానం. సాయంకాలం 7 గంటలకు ఉద యంవఱనే భోజనం. రెండుపూటలు కొద్దిగా నిమ్మరసం అన్నం లోపిండుకొనుట. ఇట్లు ఒకనెల సుమారైన తరువాత ఉప్పు కారములు పూర్తిగా విసర్జించి ఉదయం 9, 10 గంటల మధ్య గోధుమజావ, పచ్చిపాలు, బత్తాయిపండ్లు, అపు డపుడు చెక్కరకేళి అరటిపండ్లు,సాయంకాలం పొట్టుతీయకుండా గోధు మరొట్టె, నారింజపండ్లు, యీప్రకారం ఒక నెల సుమా రైన వెనుక ఉదయం 10 గంటలకు వార్చకుండ ఇగుర బెట్టిన వరియన్నం, పచ్చి ఆవుపాలు, చప్పిడి కాయకూరలు, బంగా ళాదుంపలు వగైరా; సాయంకాలం పొట్టుతీయని గోధుమ రొట్టె, పుల్లని నారింజపండ్లు, రెండుపూటల భోజనానంతరం సముద్రపు ఇసుక. అప్పుడపుడు చెరకుకర్రలు, చెక్కరకేళి, కర్పూర చెక్కరకేళి అరటిపండ్లు, బత్తాయి, నారింజ, నిమ్మ, కమలాఫలములు, పెండలం, బంగాళాదుంపలు, పనసతొనలు, బీర, పొట్ల, ఆనప, దోస, వంగ, గుమ్మడి, చిక్కుడు, వగై రా కాయకూరలు ఉడుక బెట్టినవిమాత్రమే. వారమునకు ఒకటి రెండుసార్లు నీటియావిరి, అప్పుడప్పుడు ఆతపస్నానం; కొబ్బరిబొండము, మీగడ విస్తారంగా సేవించితిని. ఇట్లు పది మాసములు దీక్షతో చికిత్సచేసి అనంతరము మామూలుగా ఉప్పుకారముల నభ్యసించితిని.

☞ పాఠకా! కేవల మగ్నిదగ్ధములుకాని ఫలాదులను సేవింప కున్నను మందులను, మిగుల నస్వాభావికములగు నాహారపదార్థములను మాని చికిత్స నవలంబించిన మాత్రముననే యిట్టి వ్యాధులనుండి విముక్తిగలిగి యా రోగ్యము లభించెగదా? కేవల ఫలాహార మాహాత్మ్యమును వేరుగ చెప్ప నేల?

—ప్ర॥ సం॥

# ప్రాకృతచికిత్సార్ణవము.

## శ్వాసాశయ వ్యాధి.

డా॥ రామవర్మ సంజీవవర్మగార్లు, నోసం, కర్నూలు.

రోగి మంగళ పెద్ద సుబ్బన్న. వయస్సు 46 సం॥రములు. కాలికమైయున్న శ్వాసాశయవ్యాధి బహిర్గతమైనది. అప్పుడప్పుడు రసవిషౌషధములచేత అంతర్గత మగుచుండెను. కడకు రోగి చాలా హీనస్థితికి వచ్చెను. మంచములోనే అన్ని యుపచారములు జరుగవలసెను. మందుల వైద్యులు చాలించుకొనిరి. "మందులపై ఆశ వదలెనా? ఉప్పుపులుసు కారములపై ఆశ వదలెనా?" యని యడుగగా అతడు "నా ప్రాణము కంటెనా ఈఉప్పుపులుసుల రుచులు" యని యిప్పటికి మాత్రం రుచులపైన యాశవదలి నా" ననెను. ఈ రోగి లక్షణములు:

సీ॥ ముఖము బొత్తలుబారి, మేనెండ కరవారి ఆధీనముం
దప్పె, నధిక వేడి। నాడులు బిగియించి, నూటారు డిగ్రీల
జ్వరముతో భయమొంది జాస్తిగాను। అధికంబుగా శ్వాస,
యెదలోన శూలించి పార్శ్వంబు పోట్లతో పలుకలేదు।
దేహంబు నిస్త్రాణ, జిహ్వాన తడిలేక దాహమొదవి చాల,
దగ్గుచుండి. గీ॥ దైవమా నామొరాలించి జీవితంబు నాకు
గలుగజేయుము తండ్రి దిక్కునీవె। యే విధాన నన్గడ
తేర్చు దేవుడంచు। దిక్కుజూచుచు పక్కలు బొక్కుచుండె.

చికిత్స:—5 ని॥ కటిస్నానములు దినమునకు 30 ని వంతున; కొద్దిగ గోధుమగంధంపాలుగాచేసి దినం1కి 2 సార్లుఆహారము; రాత్రివేళ నిరాహారము; స్నానమైన వెంటనే మంచి గాలిలో మంచములోనె యుంచి, శరీరము కొంచె మదరున ట్లూచుచుంటిమి. ఇట్లు 15 రోజులుచేసి మరియొక 3 ది॥ లు స్నానము ఎక్కించి 1 పూట లింగస్నాన మొకటిగా చేయు నప్పటికి 105 డిగ్రీల జ్వరము 102 కు తగ్గినది. 10 రోజులకు రోగికి మంచమునుండిలేచి కూర్చొనెడి సత్తా గలిగెను. నెమ్మదిగ నడువసాగెను. మొదటినుండి ఇతడు నిమ్మపులు సంటె యెక్కువ భయపడుచుండెను. నిమ్మచెక్కలు రెండు తిని తినకుండెను. ఇట్లు 13 రోజులకు అమితముగా నాకలి గలిగి పూటకు 3 నిమ్మపండ్లెక్కువగా దినజాలెను. 6 రోజుల కొక యుపవాసముతో నిట్లు $1\frac{1}{2}$ నెల స్నానముచేసి ఘోరమైన యుపద్రవ శ్వాసాశయ వ్యాధినుండి విముక్తుడై యుండుటను గాంచి, రోగియింటివారలు వారి బంధువులు ఇరుగు పొరుగువారు ఏచిన్నవ్యాధికైనా యీాయవిదాహ పథ్యముతోనే ఆరోగ్యమును గాంచుచుండిరి.

## జలోదరము.

(డా॥ అగర్వాలా కొలూరాంగారు, వంగోలు).

ఒక ఆడపిల్ల వయస్సు 3సం॥రములు. మహమ్మదీయులు. 1 సంవత్సరమునుండి జలోదరవ్యాధి; కడుపు అపరిమితముగా పెరిగిపోయినది. తల అంతకన్నను పెరిగినది. కన్నులు మూసిపోయినవి. కంఠము మొదలగు సర్వావయవములు నీటితో

నిండి స్థూలించినవి. కాళ్లుచేతులు వాచినవి; మర్మస్థానము, రెండువైపులను రెండు వెలగకాయలపరిమాణము, నీటితిత్తుల వలె క్రిందికి దిగిపోయినది. శ్వాస గొంతులోమాత్రము ఆడుచుండెడిది. సంవత్సరమునుండి యనేక ఔషధ చికిత్సలుచేసిరి. కాని నిష్ప్రయోజనము లయినవి. ఇక్కడి అమెరికావారి ఆసుపత్రి డాక్టరుగారు, యీ పిల్లను పరీక్షించి ఈ వ్యాధి యేమిదో మాకు తెలియదు. ఈ వ్యాధికి మా యొద్ద ఔషధము లేదు ఈబిడ్డ. మరురోజునకే చచ్చిపోవును. అనిచెప్పి, ఒకవేళ ఆపరేషన్ చేసి యీనీరు, తొలగించినను, తిరిగి వెంటనే యీనీరు ఎప్పటివలెనే చేరగలదుగాన లాభము లేదని పంపించిన తర్వాత యీ పిల్లను నాకు చూపినారు. వారికి తగిన ధైర్యముచెప్పి ఆరోజునుండియే ఆబిడ్డకు అభినవ వైద్యము ప్రారంభించి రోజు 1 కి మూడుస్నానములు ఉదయం 15 నిమిషముల కటిస్నానమున్ను, మధ్యాహ్నము, సాయంత్రము 15 నిమిషముల లింగస్నానములు 2 న్ను చేయించుచు, గోధుమజావ, గోధుమరొట్టె, నారింజ, పచ్చికొబ్బరి, పచ్చివేరుశనగ, మధ్య మధ్య పిల్ల యేడ్చిన యెడల చెఱుకున్ను, యిప్పించుచు చికిత్స ప్రారంభించినాను. 3 రోజులకు ఒకపర్యాయము కటిప్రదేశమునకు మాత్రము యావిరి పట్టించినాను. చికిత్స ప్రారంభించి షుమారు 1 నెల 20 రోజులు అయినది. రోజురోజుకు కడుపు శరీరము తల పిటిలావు తగ్గుచుండినది. చివరలో 3, 4 రోజులు బంకవిరేచనములున్ను అందుమీాద 4,5 రోజులు ఆటలమ్మయు చూపి

నది. స్నానపథ్యాధులు మాత్రము యథాప్రకారముగానే చేయించినాను. ఇంకా చేయించుచునే యున్నాను. ఇపుడు ఆరోగ్యముగా యున్నది. నీరంతయు పోయిన తర్వాత యీ బిడ్డను తిరిగి ఆసుపత్రికి పంపించి చూపించినాను. దొరగారున్న దొరసానియు, చాలా ప్రశంసించి చికిత్సకుని అభిప్రాయానుసారముగానే చేయుమని చెప్పినారట. ఈశ్వరానుగ్రహము వలనను శ్రీకుహినెగారి చికిత్సామాహాత్మ్యము వలనను ప్రకృతి వాక్ సుధారసమును నేను గ్రోలిన ఫలితము వలనను యీబిడ్డ మృత్యుగహ్వరమునుండి విడువబడినది.

## నారికురుపు Guinea worm.

(ప్రతాపగిరి వెంకటసుబ్బయ్య శర్మగారు, కర్నూలు.)

ఒక పురుషుడు నారికురుపుతో సుమారు 2 మాసములనుండి బాధ పడుచుండెను. ఎన్నియో మందులు కట్టినారు. నారి కొంతవఱకు బయటికి వచ్చి యుండెను. ఈ మధ్యలో ఒక వైద్యుడు వచ్చి చూచి తాను దానికి మంచి ఔషధమును కట్టెదనని దానితో నారి పూర్తిగా బయటికి వచ్చునని చెప్పెను. అతడు యిచ్చిన మందు కట్టి అతడు చెప్పిన రీతిని కట్టుపైన నీళ్ళుపోసినాడు- రాత్రి యగుసరికి కురుపు దగ్గర అద్భుతమైన మంటలు, కాలువాపు, సుమారు 103 డి॥ జ్వరము వచ్చినది. అప్పుడు నన్ను పిలువగా నేను వెళ్లి ఆ కట్టును విప్పివేసి కాలును కడిగి, వాచిన స్థలమునకు మట్టి పూసితిని. పుండుకు చుట్టు మట్టిబిళ్ల చేసి కట్టు కట్టితిని. ఆ రాత్రి కొంతవరకు మంటలు తగ్గినవి. మరురోజునుండి ఉప

యము—నీలి (Blue color) సీసాలోని నీళ్ళతో పుండును కడిగి మల్లెపూవులు వేసి కట్టితిని. మధ్యాహ్నమున, నీలి రంగును పుండుపైనను వాపుపైనను అరగంటవరకు ప్రసరింప చేసితిని. రాత్రి యుదయమువలెనే దినమునకు 1, 2 పర్యాయములు కాలుకు వాచినస్థలమున ఆముదమును పూసి వేడి నీళ్ళకాపు ఇచ్చుచుంటిని. రాత్రి 1 ఔన్సు పీతవర్ణోదకమును ఇచ్చుచుంటిని. దీనివలన విరేచనము సాఫీగా అగుచుండెను.

పథ్యము:—గోధుమాహారము తాజాకాయగూరలు

ఈరీతిగా రెండురోజులు జరుగునప్పటికి జ్వరము తగ్గినది. మంటలు బొత్తుగా లేవు. వాపు తగ్గినది. కాని బయటికి వచ్చిన నారి తెగిపోయినది. అప్పుడు ప్రక్కజనులు రోగికి భయోత్పాదకమైన మాటలు చెప్పిరి. లోపల మిగిలియున్న నారి వేఱొక మార్గముగా బయటికి వచ్చునని, అప్పుడు చాలా బాధ కలుగునని భయపెట్టిరి. కాని రోగికిమాత్రము ఈ చికిత్సయం దుండు నమ్మకముచే ఈచికిత్సనే యవలంబించెను. పైచికిత్సనే 15 రోజులు చేయునప్పటికి లోపలచెడుగు పుండు ద్వారా బయిటికి వచ్చి ఆరోగ్యము వచ్చినది.

## చంక (ARM PIT) లో గడ్డలు (వర్ణచికిత్స)

ఒక రోగికి చంకలో 2 గడ్డలు లేచినవి. అతడు మొదట 2 రోజులవరకు మన్ను పూసినాడు. కాని అవికఱుగక బాధ చాలాచేసినవి. పిమ్మట నావద్దకు వచ్చెను. నేను దానికి దినమునకు 2 మార్లు పీతవర్ణోదకముతో తడిపిన ముతకగుడ్డ

చుట్టి పైన ధోవతి కట్టుచుంటిని. జనులు అవి చంకతాళిగడ్డలని వాటిని కోయించవలెనని లేనియెడల చాల బాధచేయునని రోగిని భయపెట్టిరి. కాని పై చికిత్సనే ఆరురోజులు చేయుసరికి అవి పగిలి కారిపోయినవి. తరువాత ఆకుపచ్చ (Green) సీసాలోని నూనెలో దూది తడిపి కట్టుకట్టితిని. పూర్తిగ నిమ్మళించినవి. పాఠకులారా! చూచితిరా పత్రికృతి మాతయొక్క కృత్యము! ఆపరేషను చేయవలయు నన్నవాటిని ఆపరేషను లేకయే కుదిర్చినది. ప్రి. సం. శ. కర్నూలు.

## పరిణామశూల (Appendicitis)

(పాలపర్తి నరసింహారావు, పత్రికృతివైద్యులు, వేటపాలెం.)

రోగి స్త్రీ. వయస్సు 55 సం॥లు. షుమారు 5 సం॥ల నుండి శూలవ్యాధితో బాధపడుచున్నది. ఈమెకు ప్రతిరోజు సాయంకాలము 4 గంటలకు నొప్పి ప్రారంభమై రాత్రియంతయు అమితమైన బాధపడును. పరుండుట కవకాశము లేదు. పగలు మాత్రము ఒకటి రెండుగంటలు మాత్రమేమి నిదురించునో తెలియదుగాని, 2 సం॥ లనుండి రాత్రులయందు నిదురయే లేదట. బాధ యేభాగమందున్నది విచక్షణ చేయలేదు. కటిప్రదేశమునకు అన్నివైపుల సమాన బాధయే. బాధ ఇంతింత యనరాదు. ద్రవపదార్థమగు నాహారము గాని, మంచినీరుగాని త్రాగిన 15 నిమిషములలో వమనమగును. ఇట్టి పరిస్థితులలో, రోగికి ఆహార మిముడకుంచిన క్షీణించునను దురభిప్రాయముతో వమనమైన తరువాత మరలమరల ఏదో ఘనపదార్థమో ద్రవపదార్థమో ఇచ్చుచుండెడివారు. ఏకా

రణముచేసినను భుజించిన పదార్థము, ఏ స్వల్పభాగమో జీర్ణ కోశమునందు నిలిచిన, ఆదినము ఆమె పడుబాధ భగవంతునికెరుక. మలవిసర్జన అసలే లేదు. వారముదినములకో, పదిరోజులకో అవసరముండి వెళ్లిన ఒకటి రెండు గట్టి పెంటికలు మాత్రము పడిపోవును. అనేక వైద్యములైనవి. ఆశలు వదలుకొని ప్రకృతిమాత నాశ్రయించిరి.

ప్రకృతి చికిత్సాక్రమము:—ఇతరాహారములు పూర్తిగ వర్జించునట్లు చేసితిని. 2 గంటలకొక పర్యాయము రెండుమూడు చెంచాల నారింజరసము చప్పరించి మ్రింగుమంటిని. మొత్తముమీద దినమునకు 2 నారింజ పండ్ల రసమున కంటె అధికము లేదు. మొదటి వారముదినములు ఆ 2 చంచాల రసముకూడ వమనమైనది. ప్రతినిత్యము భరింపగల వేడినీటితో ఉదయము సాయంకాలయందు ఎనీమా చేయించితిని. ఎనిమా పట్టినపుడెల్ల 1,2 గట్టి పెంటికలు పడుచుండెడివి. ఇట్లు దినమునకు 3,4 పెంటికలు చొప్పున షుమారొక 40 దినములవరకు పడినవి. ప్రేవులభారము కొంతవరకు తగ్గిన తరువాత త్రాగిన నారింజరసము వమనము కాలేదు. క్రమేణ దినమునకు 3,4 పండ్లరసముకూడ జీర్ణించుకొనగల శక్తిగలిగినది. 20 దినములు చికిత్స గడచిన తరువాత శూలనొప్పి వెనుకడుగువైచినది. రాత్రులయందంత విపరీతమైన బాధ లేదు. 49 దినముల తరువాత రాత్రులయందు కొంతసేపుండి తగ్గిపోవుచుండెడిది. 2 మాసములయిన తరువాత దినము విడిచి దినము రాప్రారంభించినది. 3 మాస

ముల తరువాత 3,4 దినముల కొకపర్యాయము స్వల్పమైన బాధ కనుపించి ఒకటి రెండు గంటలలో శాంతించుచుండెడిది. 4 వ మాసాంతమున పూర్తిగ ఆగిపోయినది. 2 మాసములు ఎనీమా చేసిన తరువాత దానంతటది విరేచనమైనది. ప్రథమమునుండి రోగిని అశక్తతవలన తొట్టిస్నానములు చేయించలేదు. దినమునకు రెండు పర్యాయములు కటి ప్రదేశమునకు వేడినీటి కాపడము (Fomentation) కాయించి, ఆప్రదేశమునకు వెంటనే తడికట్టు (Cold abdominal pack) వేయించితిని. దినమున కొకపర్యాయము తడిచేతితో ప్రతిక్రియ గలుగువరకు శరీరమర్దన (Wet-hand rub) గావించితిని. హోమోపతి మందులు కాలిమూర్ 6 × మాగ్నిషియ ఫాస్ 5 × న్ను ఇచ్చితిని.

రోగి చాలవృద్ధురా లగుటవలనను, రోగమువలన చాల క్షీణించియుండుటచేతను చికిత్స చాలకాలము పట్టినది. ఇప్పటికిని పప్పుపదార్థములు జీర్ణించుకొనలేదుగాని మొత్తము మీాద ఆరోగ్యము గలిగి సుఖించుచున్నది.

ఈవ్యాధికి మలబంధమే ముఖ్యకారణము. మలబంధము నివారించిన వ్యాధి నివారణయగును. ఈ రోగము తత్సంబంధమైన సూక్ష్మజీవుల వలన కలుగుననియు, క్రిమికలో (Appendix) విత్తనములు, మరియితరములైన అన్యపదార్థములు చేరుటవలన ఈ వ్యాధి ప్రబలమగునని ఆంగ్లేయవైద్యుల సిద్ధాంతము. అందుచే నీవ్యాధియందు క్రిమికను కోసివైచుచున్నారు. అట్లు చేయుటవలన కొంతకాల ముపశాంతి కలిగినను, రోగమునకు మూలమైన మలబంధము, మలబంధమునకు కారణమైన దురభ్యాసములను వా రెన్నటికిని మాన్పజాలరు.

☞ హోమోపతిమందు లియ్యకున్నను కేవల జలచికిత్సవలనను రోగనివారణ మగును. —ప్ర. స.

# అగ్నివ్రణములు.

ఒకని బట్టకు నిప్పు తగిలినయెడల మనము మిగుల భయపడెదము. ఎవని బట్టకు నిప్పు తగిలెనో, వాడు ధైర్యమును చేవదలరాదు. కొంగునకు నిప్పంటుకొనిన, దానిని తత్క్షణమే చేతులతో నలిపి యార్పవలయును. బట్ట యంతయును తగులుకొన్నప్పుడు వెంటనే పరుండి నేలపై పొరలవలెను. జముకాణముల వంటి దట్టమైన బట్టలతో వానిని జుట్టియుంచవలయును. నీరు సమీపమందున్న దానిని సయితము వానిపై పోయవలయును. నిప్పు ఆరిపోగానే వాని ఒడలియందేమైనను పుండు ఏర్పడెనా యని చూడవలెను. పుండైన చోట బట్ట అంటుకొని పోవును. ఆ బట్టను తటాలున లాగక మొలకునతో దానిని కత్తిరించి వేయవలెను. అట్లు చేయకున్న బట్టతోడ కండయును పెల్లగిలి వచ్చును. అటుపిమ్మట కాలిన చోట్లయందు మన్ను పోట్లిసు కట్టుట యుక్తము. దీనివలన మంటలు వెంటనే శమనమగును. దేహమునందెచ్చట నైనను బట్ట యంటుకొనిపోయి యుండిన దానిమీదనే పోట్లిసు కట్టవలెను. మన్ను తడి యెండుట కారంభించగానే దానిని తీసివేయవలెను. చల్లనినీరు తగులుటవలన అపాయము గల్గునని భయపడ వలసినదిలేదు. ఇట్లు ప్రథమ చికిత్స చేయక పోయినప్పుడు, దిగువ చెప్పినచొప్పున చేయనగును. లేత యరటియాకుమీద ఆలివ్ నూనె లేదా కొబ్బరి నూనెను పూసి, దానిని వ్రణములమీద బెట్టి కట్టవలయును.

అరటియాకు దొరకకపోయిన, దానికి బదులుగా బట్టను నుపయోగించవచ్చును. యూకలిప్తనముల తైలమును నిమ్మ పండురసమును సమభాగములుగ గలిపి పూయవచ్చును. అంటుకొనిపోయిన బట్టను దీయవలసి వచ్చినపుడు గోరు వెచ్చగనున్న నీరు గలిసిన పాలను దానిపై నించుక పోసిన అది తడిసి జరిగి వచ్చివేయును. నూనె చమిరిన యాకునో బట్టనో రెండు దినము లుండనిచ్చి తీసివేయవలయును. పిదప ప్రతిదినము వేయుచు రావలయును. నిప్పు తగిలినచోట్ల బొబ్బలు లేచినయెడల వానిని పొడిచి నీరు దీసివేయవలయును. కాని తోలును అట్లే యుంచవలెను. నిప్పు సెగచే తోలు కమలిపోయి యున్నయెడల మన్ను పోట్టిసు కట్టుటయే తగిన చికిత్స యగును. వేళ్లకు మన్ను కట్టవలసి వచ్చినప్పుడు ఒకటికొకటి తగులనట్లు చూడవలయును.

—కృష్ణాపత్రిక.

## ముట్టునొప్పి.

(యస్. యస్. కె. రంగయ్యగారు, టీచరు, సత్తెనపల్లి.)

మీ సలహాప్రకారం నాభార్య ముట్టుకుట్టునొప్పికి తొట్టి స్నానవైద్యమును 6-3-33 తారీఖున ప్రారంభించినది. మొదలుపెట్టిన 20 వ రోజుకే అనగా 28-3-33 తారీఖున బహిష్ఠయినది. కాని నొప్పి యెంతమాత్రమును రాలేదు. రాత్రియంతయు సుఖనిద్ర పొందినది. తిరిగి మరియొకమాస మీచికిత్సనే చేయించదలచియున్నాను.

చికిత్సా వివరములు:—

(1) ఉదయము:—పొత్తికడుపునకు 30 నిమిషములు వేడినీటికాపు, కటిస్నానం. (2) మధ్యాహ్నం:—పొత్తికడుపునకు పట్టీలు. (3) సాయంత్రం:—కటిస్నానం.

ఆహారములో మార్పులచేకాబోలు విరేచన బద్ధకం కలిగినది. అందుచే కటిస్నానంబదులు ఉదయం వేడినీటియొక్కయు చన్నీటియొక్కయు ఎనీమాలు చేయించుచుంటిని. ఇది రెండురోజులకు మూడురోజులకుమాత్రమే. మధ్యాహ్నం ఒక్కొకనాడు ఆతపస్నానములు చేయించుచుంటిని. ఆవిరిస్నానం చేయింపదలచియు వీలుగాక చేయించలేకపోయితిని. ఆహారము:—నారింజపండ్లు, చక్కెరకేళీలు, నిమ్మపండ్లు, ఆవుపాలు పచ్చికూరగాయలు (ఉడికించి) గోధుమజావ. ఈపైనుదహరించిన చికిత్సాక్రమము కొలదిరోజులకే యిట్టి గొప్పమార్పుల గలిగించినందులకు ఎంతయో సంతసమందుచు మీవైద్యవిధానమును కొనియాడుచు మాకృతజ్ఞతాభివందనముల మీకు చెల్లించుచున్నాడను. ఇట్టి వైద్యమును ఇనుమడించిన అభిలాషచే వ్యాప్తినొందించి ప్రజాబాహుళ్యమునందు నాటుకొనియున్న అపనమ్మకపిశాచమును పారదోలుటకు తోడ్పడు విజ్ఞానవంతులను ప్రార్థించుచున్నాడ. ఇట్టి వ్యాధితో బాధపడు తల్లు లెందరో ప్రపంచమున గలరు. బాధ నివారణకై అనేక అప్రశస్తచికిత్సలంబడసి తుదకుధనమును వ్యయపఅచుటయేగాక శరీరారోగ్యమును కోల్పోయి ఆసాంతమునకు నిరాశనొందు యువతుల నెందరనో మనము చూచుచున్నాము.

# రక్తగ్రహణి (Dysentry)

(డా॥ లక్ష్మీశ్రేష్ఠి పట్టెయ్యశర్మగారు. ప్రకృతివైద్యులు, అమలాపురం.)

నాకు యిప్పటికి సుమారు 10 సంవత్సరముల క్రితం రక్తగ్రహణి అంకురించినది. దాని నిమిత్తము మరల కూనె జలచికిత్సను ప్రారంభించితిని. నేను దావాల నిమిత్తము కోర్టులో ప్రతిదినము హాజరు కావలసి వచ్చుటవలన నామిత్రుఁ లొకరు వచ్చి మీరు దగ్గరలేకపోతే దావాలు పాడుపడిపోవును. ఒక్క మాత్ర ఇచ్చెదను వేసుకొనుమనిన్నీ, ఆహారం తినుమనిన్నీ, విరేచనములు కట్టుననిన్నీ, కోర్టుపని పూర్తియయిన వెనుక జలచికిత్స ఆచరించ వచ్చుననిన్నీ, బోధించి బలవంతముగా మాత్రఇచ్చి ఆహారమును యిప్పించెను. వెంటనే బాధ ఎక్కువయినది. ఏమయినను సరేయని దైవముపై భారము వైచి, ధైర్యము నవలంబించి పిమ్మట జలచికిత్స నారంభించితిని. ఆకలి లేనందున కటికలంకణములతో నుంటిని. 10 లంకణములయిన తరువాత ప్రకృతి చికిత్సాభిమానులును, ఆయుర్వేద వైద్యులు నగు శ్రీ కొర్లపాటి వీరాస్వామి నాయుడుగారిని రప్పించి సలహా కోరగా శ్రీవారు నాకు నీరసంగా యున్నందున పచ్చిఆవుపాలు పుచ్చుకొనుమని సలహా యిచ్చినందున ఆపూటనే అరసోలెడు పచ్చిఆవుపాలు ఒకపూట పుచ్చుకొనగానే మరల కడుపునొప్పి ఎక్కువయి బాధించగా, ఆహారము మాని కటికలంకణములతో చికిత్సనాచరించి, పరిపూర్ణారోగ్యమును 24 దినములలో పొందితిని.

చికిత్సావిధానము:—చిన్నపాత్రలతో పొత్తికడుపునకు ని॥ 50 లేక ని॥ 60 లు నీటిఆవిరి, ఆవెంటనే ఒక గం॥ సేపు లింగస్నానం ప్రారంభములో 2,3చన్నీటి ఎనీమాలుకూడా చేసితిని. 2,3 రోజుల కొకసారి కటిస్నానం, ఒకొక్కసారి ని॥30 లు ఒకొక్కసారి ని॥ 20 లు చేసితిని. వ్యాధి ప్రారంభములో రోజు 1 కి రేయింబవలు 20 మొ॥ 35 విరేచనములవరకు అయ్యేవి. పొత్తికడుపునకు ఆవిరిపట్టి లింగస్నాన మయ్యేసరికి 10 విరేచనములకు, బాధతో యెంత జిగురు పడేదో బాధ లేకుండ సులువుగా చాలజిగురు ఒక్కసారే విరేచనములో పడేది. తరుణవ్యాధులలో దీర్ఘస్నానములే నాయనుభవములో ఎక్కువ ఉపకారముగా కనుపడినవి. పచ్చిద్రాక్షపండ్లు మదరాసునుంచి తెప్పించియుంచితిని. 24 వ దినమున తెల్లవారుజామున గం॥ 4 లకు కరకర ఆకలి కాగా నోరు పుక్కిలించి ఆకలికి ఆగలేక పచ్చిద్రాక్షపండ్లు 10 తినేసరికి ఆకలి తీరినది. 15, 20 రోజులకు విరేచనములు పూర్తిగా కట్టిపోయినవి. చికిత్స ప్రారంభమయిన లగాయతు విరేచనములు చాల భాగము ఆరోజు కారోజు తగ్గుచు జిగురుమాత్రం విస్తారంగా కడుపునొప్పి లేకుండ సులువుగా పడేది. క్రమముగా విరేచనములు కట్టినతరువాత స్నానకాలపరిమితి, ని॥ 15 ల లోనికి వచ్చినది. మొట్టమొదట రోజు 1 కి రేయిం బవలు 5, 6 స్నానములు అయ్యేవి. తగ్గినతరువాత క్రమముగా రోజు 1 కి 3,2 స్నానములవరకు వచ్చినవి. చివరకాలములు ఉదయం ని॥ 15 లు లింగస్నానం సాయంకాలం ని॥ 10 లు

కటిస్నానం చేసితిని. వ్యాధి ప్రారంభము లగాయతు 2 మాస ములవరకు చికిత్సచేసితిని. పథ్యం పుచ్చుకున్నతరువాత ఆకలి క్రమంగా వృద్ధియైన తరువాత క్రమముగా గోధుమజావ, నారింజలు, పచ్చిద్రాక్ష, కొబ్బరిబొండముల నీరు లేతమీగడ వంటికొబ్బరి, బత్తాయి, నారింజవగయిరా లఘువు ఆహారము, ఆవుగుమ్మపాలు పుచ్చుకొంటిని. అటుపిమ్మట మరల ఉప్పు కారం మామూలుఆహారమే సేవించితిని.

## జ్వరము - రక్తగ్రహణి.

ఇప్పటికి సుమారు 5, 6 సం॥ రముల క్రితము నా జ్యేష్ఠ కుమారునికి (వయస్సు సుమారు 4 సం॥ రములు) జ్వరము, రక్తగ్రహణి కలుగగా నేను గ్రామములో లేనందున ప్రథమములో జలచికిత్స ప్రారంభించి 1-2 రోజులు గుణము కనుపించనందున వరుసగా నేటివుడాక్టర్లు ముగ్గురచే 5-6 రోజులు చికిత్స చేయింపగా కుదురనందున వారు మావల్ల కాదని నన్నెచట నున్నానో రప్పించమని చెప్పిరి. అంత అమలాపురమునుండి శనివారము సాయంకాలము సుప్రసిద్ధాయుర్వేద వైద్యులగు సోమయాజులుగారును నేనును బయలుదేరి మాయింటికి (మోలిగ్రామము) వెళ్లితిమి. ఆయన రోగిని చూచి అతిత్వరలో నివారణ చేసెదనని శనివారము రాత్రి ఆదివారము 1 పూట చికిత్సచేసిరి. ఎంతమాత్రమును గుణము కనుపించలేదు. అంత నేను జలచికిత్స ప్రారంభించితిని. 4 రోజులలోనే ఆరోగ్యము పొందినాడు.

చికిత్సావిధానము:— పొత్తికడుపునకు ని 15 లు ఆవిరి. ని 30 లు లింగస్నానము. మరల రెండు గంటలకు ని 10 లు కటిస్నానము. మరల 2 ఘంటలకు పొత్తికడుపునకు ని 15 లు నీటిఆవిరి. ఈప్రకారం ప్రతి 2 గంటల కొకసారి యొక్కొక స్నానము చేయించితిని. రాత్రులందు పొత్తికడుపునకు 2, 3 సార్లు ని 30 ల చొప్పున మట్టిపట్టీలు వేయించితిని. క్రమముగా జ్వరము తగ్గినది. జిగురు వెళ్లిపోయి విరేచనములు 2 రోజులకే కట్టినవి. 4 వ రోజున ఆకలి యయ్యెను. నారింజ ఫలము లిచ్చితిని. క్రమముగా ఆకలి వృద్ధియైనకొలది గోధుమజావ, నారింజ, బత్తాయి ఫలములు, కొబ్బరి బొండముల నీరు, కొబ్బరిలోని మీగడ నిచ్చుచుంటిని. 4 వ నాడు పథ్యముపెట్టిన తరువాత రోజు 1 కి రెండుస్నానములు మాత్రమే ఉదయము ని 5 లు కటిస్నానము, సాయంకాలము గం 3 లకు, ని 10 లు లింగస్నానము చేయించితిని. ప్రతి స్నానానంతరము ఊలుశాల్వ కప్పుచుంటిమి. ఇటుల 15 రోజులు చేయించితిమి. —డా॥ ల.వ.శ.

## విషమజ్వరము.

గ్రామము విలసవిల్లి రోగి వయస్సు 4 సంవత్సరములు. జ్వరము పోవునిమిత్తము నేటివుడాక్టర్లచే నానావిధౌషధచికిత్స చేయించిరి. 8 లంకణములు. పనియుండి వారి యింటికి వెళ్ళితిని. విషమపరిస్థితిలో నున్నది. అప్పుడైన నన్ను చికిత్స చేయమని కోరలేదు. వ్యాధి ముదిరినందున 12 లంకణములు

కట్టిరి. రోగి బ్రతుకడని అవతల పెట్టి చికిత్స చాలించుకొనిరి. అప్పుడు నా నిమిత్తమొకరు కోరి వచ్చిరి. కూనే జలచికిత్స చేయించితిని. పరిపూర్ణారోగ్యము నొంది పిల్లవాడిప్పటికి చాలాబాగుగా నున్నాడు.

చికిత్సావిధానము:—రోజుకు 1 సారి నీటి ఆవిరి, 10 నిమిషములు కటిస్నానము, 15 నిమిషములు లింగస్నానము, చొప్పున రోజు 1 కి 4 స్నానములు; రెండవరోజున ఆతప స్నానము 15 నిమిషములు. చెమట పట్టినది. దాహమయి నపుడు నిమ్మరసము కలిపిన నీరు. 4 రోజులకు ఆకలి పుట్టగానే నారింజఫలములు, ఆహారము. అటుపిమ్మట 6 వ నాడు గోధుమ జావ, నారింజఫలములు. 4 రోజులకే జ్వరము తగ్గినది. 15 రోజులకు పరిపూర్ణారోగ్యము నొందెను. జ్వరము తగ్గినతరువాత రోజు 1 కి 2 కటిస్నానములు ని॥ 5 లు చొ॥ కనే చేయించితిమి. రోజు విడిచి రోజు ఆతపస్నానము చేయించితిమి. డా॥ ల. ప. శ.

## చలి జ్వరము

మార్కాపురం తాలూకా తహసీల్దారులవారి తృతీయ పుత్రుడు బాలకృష్ణవర్మకు చలిజ్వరము. 1 ది॥ విడిచి మరుదినము తప్పక వచ్చుచుండును. 104 డిగ్రీలజ్వరము వచ్చుటకు ముందుగా శరీరమాద్యంతము చల్లనయి నాడులు కనుపించకుండి భరించరాని చలితో వడవడ వణకించి ఎంతవణకుగలుగునో అంత కధికముగా జ్వరము వచ్చుచుండును. 5,6 సార్లు వచ్చి

నది. చిల్లరమందులు, ఆంగ్లవైద్యములు చెట్టాకు పుట్టాకుల కట్టు లనేకములు కట్టినను జ్వరము విడువదాయెను. 15-11-32 తేదీన జ్వరితుని ముఖవైఖరి నల్లబడి బొడ్డుకిక్రింద 1 అంగుళము పురోభాగం, చెవికిక్రింద కొంచె ముబ్బియుండుట, పిరుదుల చర్మము బిరుసుగా నుండుట, పెదవులు వాడుట, కంఠముక్రింద గడ్డముకిక్రింద నూదియు దెలియకుండుట, ప్రబలమగు మల బద్ధము, చెమట రాకపోవుట కలిగెను. మొదటినుంచి మూడు వేళల లింగస్నానములు 10-12 ని॥ చేయుచు, జ్వరము రాని దిన మొక యావిరిపట్టి లింగస్నానములే చేయుచు మరు దినము జ్వరము వచ్చుటకు ½ గంటముందుగానే ఒక ఆవిరి స్నానము, వెంటనే లింగస్నానము 12 ని॥ లు చో॥- ఇట్లు నాలుగు రోజు లావిరిస్నానములతో లింగస్నానములలో జ్వరము చలియు నశించెను. అది మొదలు 14-12-32 తేదీకి మలబద్ధముగూడా విడిచెను. శరీరచ్ఛాయ స్వాభావికముగా నుండెను. స్వేచ్ఛగా బడికిపోవుచుండెను. పథ్యము చప్పిడి గోధుమరొట్టె కాంజికము పెసరపదార్థములు, నిమ్మ ఫలములు, ఇచ్చుచుంటిమి. —డా॥ రా. సం., నొసం.

## పాముకాటు (Snake Bite)

(క॥ చి॥ రామవర్మ సంజీవవర్మగార్లు ప్రకృతిచికిత్సకులు, నొసం.)

ప్రొద్దుటూరు తాలూకా పెద్ద చీపాటిలో 24-9-32 న భూమరాజు సుబ్బణాచార్యులకు రాత్రి 10½ గంటకు సర్పదష్టమైనది. కుడికాలి మడిమెకు చీలమండ క్రింద వెనుక పెద్దనరమునకు వెలపల 4 కోరలు, లోపల 3 కోరలు, దిగబడి,

రక్తము చుక్కలు వెడలియుండి పసుపువర్ణపునీరుగా విషము మడిమంతటికి ప్రూసినట్లేయుండెను. అప్పుడు సుబ్బణాచార్యుల యింటిలోనే మేము బసచేసియుంటిమి. సర్పదష్ట విషహారోపచారమిట్లు చేయుటలోనే (½ గం॥) రాత్రి దీపపు వెలుగుచుట్టు పరాగము నిండినట్లు, మనుష్యులు ఏదో ఒక గదిలో నుండినట్లు, మాటలు సహా దూరముగా మాట్లాడినట్లు, రెండుకాళ్లు మోకాళ్లవరకు స్వాధీనము లేక బరువైనట్లు, కన్నులకు పూర్తిగా నిద్రవచ్చినట్లు నున్నదని చెప్పెను. ఆవిరి తయారయ్యే వేళకు ఒక గంట యయ్యెను. ఆవిరి పట్టించి చెమటంతయు కడిగివేసితిమిగాని పాము కరచినకాలు మోకాటివరకు చెమట గ్రమ్మనేలేదు. అందువలన 1 గంటసేపు కాలికి మాత్రమే ఆవిరి పెట్టగా చెమట క్రిమ్మినది. చెమటవన్నె తెల్లగుడ్డతో నొత్తి చూడగా పసపురంగుగా నుండెను. తొట్లు లేనందున వెంటనే షుమారు 6 కడవల చన్నీటితో చెంబులతోనే కటిప్రదేశమున బోయుచు నడుముచుట్టును ఒక ముదుకఖాదీగుడ్డతో రుద్దుచు 1 గంటసేపు కటిస్నాన మొకటయ్యేవరకు కండ్లమబ్బులు, మైకము, కాళ్లతిమ్మురులు, దూరమునుండి శబ్దములు వినుట, తగ్గి వెల్లడిగా రాత్రి ఒంటిగంటకు విషము నిర్విషమై భయము తీరి ఆరోగ్యవంతు డయ్యెను.

---

# కుహినే చికిత్సావిధానము

డా॥ బొల్లాప్రగడ సుందర గోపాలరావుగారి అపక్వా
హారాద్వైత సిద్ధాంతమను గ్రంథవిమర్శనము.
(పువ్వాడ పేరాజుగారు, ధవళేశ్వరము.)

రాజమండ్రిలో నీ 1932 సం॥ రమందు జరిగిన ప్రకృతి వార్షికసభానంతరమందు నా. హనుమయ్యగారును, శ్రీ దువ్వూరి వీరభద్రయ్యగారును, శ్రీబొల్లాప్రగడ సుందరగోపాలరావు పంతులుగారును, పుచ్చా వెంకటామయ్యగారును, నేనును ఇంక మరికొందరును కూడి, శ్రీ బొల్లాప్రగడ సుందర గోపాలరావుపంతులుగారు కుహినీ మహర్షిని గూర్చి తమ అపక్వాహారాద్వైతసిద్ధాంత మను గ్రంథమునందు చేసిన విమర్శ అన్యాయమైనది, న్యాయవిరహితమైనదియు నగుటచే సవరణ చేసుకోవలసినదని సుందరగోపాలరావుగారిని కోరగా, తమకు కుహినీమహర్షి యందు గురుభావమే కాని మరియొకటి లేదనియు, వారు వ్రాసిన పుస్తకమునందుగాని, వారిసిద్ధాంతము నందుగాని లోపములు లేవనియు, తమగ్రంథమునకు కూడా కుహినీ గ్రంథమే ఆధారమనియు చెప్పుచూ, తమ పుస్తకమునందు కుహినీసిద్ధాంతమును గాని, గ్రంథమును గాని, కుహినీ మహర్షినిగాని, నిందించినట్లు కనబడెడు వాక్యము లున్న అవి ప్రమాదముచే సంభవించి యుండును గాన తాము సంతోషపూర్వకముగా వానిని సవరణచేసికొని ముందురాబోవు కూర్పునందు నిందావాక్యములుగా కనబడు వానిని తీసివేసెదమని ఒప్పుకొని తమకు శ్రీ కుహినీమహర్షి

యందుగలగురుభావమును వెల్లడించిరి. అప్పుడు అపక్వాహారా ద్వైతసిద్ధాంతమునందు కుహినీమతనిందావాక్యముల సవరించి ప్రకృతి వైద్యావలంబుల ఉపయోగార్థ మొకవ్యాసము వ్రాయవలసినదిగా నన్ను నియమించియున్నందున నీవ్యాసమును ప్రకృతి వైద్యావలంబులయొక్కయు ప్రత్యేకించి కుహినీమతావలంబుల యొక్కయు, మనోవైకల్యంబుల సవరించుటకును శ్రీసుందరగోపాలరావుగారి మనస్సులో కూడ కుహినీసిద్ధాంతమునందు ఏవిధమైన సందేహమును లేదని లోకమునకు వెల్లడించుటకును, సుందరగోపాలరావు గారియందు నాకుగల గౌరవమును దెల్పుచు, వారిగ్రంధము నందు కుహినీమతవిమర్శనతోబాటు ఈ క్రింది వాక్యముల జదువ బ్రార్థించుచున్నాను

లూయీ కుహినీగారు అపక్వాహారమువలన యెనీమా మొదలగు కృత్రిమసాధనము లక్కరలేకయే విరేచనము స్వభావ సిద్ధముగా అగుననియు, గోధుమజావ రొట్టె మొదలగు పక్వాహారము తినువారు సముద్రపు ఇసుకను వాడిన, విరేచనబద్ధకము వదలి సుఖవిరేచన మగునని వ్రాసియున్నందున, అపక్వాహారమునందు నమ్మకము లేకనో (2) యీతీవ్రఅపక్వాహారనియమ మేర్పరచిన తమ మతము నందు జనులు చేర రనుభయముచేతనో యని వ్రాసియున్నారని పంతులుగారు వ్రాసిరి. ఇవి రెండును కుహినీ మహర్షియుద్దేశములు గావు. రోగియొక్క జీర్ణకోశము బాగుపడి పక్వాహారము జీర్ణము చేసికొనుటకు తగుశక్తి జీర్ణకోశమునకు వచ్చు

వరకు అపక్వాహారసేవయే చేయవలయు నని స్పష్టముగా వ్రాయుచు తరతరములనుండి మానవకోటి, స్వభావ సిద్ధ మైన యాహారము నుండి మరలి తప్పుత్రోవ నుండుటచే మానవుని దంతములు మొదలగునవి కత్తి మొదలగు సాధనముల సాహాయ్యము లేక కోతులవలె పచ్చివస్తువులను కొరుకుకొని తినునంతటి దృఢముగ లేనందునను, చిరకాలాభ్యాసముచే తమ తోడిమానవకోటినుండి ఒకసారి వేరుపడవలయునను భయము తొలగించి క్రమాభ్యాసముచే స్వాభావికాహారలాభము గ్రహించుట, పళ్ళు గట్టిపడుట కలుగు వరకు పక్వాహారమును నియమించెనుగాని, అపక్వాహార శ్రేష్ఠత తెలియక అట్లు చెప్పలేదు. మనుష్యుడు కోతివలెనే ఫలహారియనియు, పండినపండ్లకంటె, పక్వమునకు సిద్ధముగా నున్నవియు, కాయలలో సాధ్యమైనంత లేతవియును శ్రేష్ఠతమములని నిరూపించుటచే కుహినీ మహర్షి అపక్వాహార ప్రాముఖ్యతను పూర్తిగా గ్రహించియున్నా రనియును శ్రీసుందరగోపాలరావుగారు దానిని, నిర్భయముగా ఆంధ్రదేశమునందు వెల్లడిపఱచిరనియు గ్రహింపవలసి యుండును. వీ రిరువురమధ్యను మరికొంద రుండినను ఉండవచ్చును. కాని శ్రీసుందరగోపాలరావుగారి సిద్ధాంతము ప్రకృతివైద్యావలంబకులకు క్రొత్తది కాదుగాని వారు నేర్చుకొన్న దానికి సహాయముగను, అపక్వాహారముతో గాని పక్వాహారముతో గాని నిమిత్తములేక, కుహిని చికిత్సవలన సమస్తరోగములు కుదురునని ఘంటాపథముగ చాటించెను. రోగ మున్నంతవరకు

తిండికొరకు ఆలోచన అక్కరలేదు. ఏదిదొరికిన అది, దేశకా లానుసారముగ రసయుక్తమైన ఫలమైయుండిన రుచినిగోరకయే జీర్ణమును జూచుకొని భుజించమని నియమించెను. పంతులుగారికి తోచిన మూడుసందేహములకు తావు కనుపించదు. ప్రపంచకమందు సంపూర్ణారోగ్యవంతులు కుహ్నీగారికి గాక ప్రకృతివైద్యవేత్త లెవ్వరికిని కనుపించనిమాట సత్యము. ఏలయన ఆరోగ్య మననేమో తెలియని మందులవైద్యుల కందరకును ఆరోగ్యముగా నున్నట్లు అగపడినను స్వాభావికాహారమును విడచి, అనేకతరములనుండి కృత్రిమాహారసేవజేయు మానవులలో ఆరోగ్య మెక్కడనుండివచ్చును? మూడవది ఆరోగ్యవంతులకు తేజోబల ముండులాగున అపక్వాహార నిర్ణయము చేయకలేకపోవుట. సృష్టియందలి జీవజంతువులకు స్వాభావికముగానే తమయాహారము తెలియుచుండగా మనుజులకు అట్టి యాహారనిర్ధారణ మొకరిచే చేయబడవలసిన అవసరము లేదు. గాన ఆరోగ్యవంతుని ఆహారవిషయములో ఆయన విశేషముగా వ్రాయలేదు. స్వాభావికాహారమును తినువారు ఎక్కువగాని తక్కువగాని కాకుండ కావలసినంత తమ యాకలిని బట్టి సేవించుదురు గాన నిర్ణయ మక్కరలేదు. కల్పితరుచులచే నానియమము ఆగుటలేదు. ఎప్పుడు గడ్డినే తిను పశువు హెచ్చు తినక, ఎక్కువైన చెంగలిగడ్డినికూడ ప్రక్కవేసికొని పరుండునేగాని తినదు. గాన ఆరోగ్యవంతుడగు స్వాభావికాహారికి సహజజ్ఞానము (Instinct) తప్ప

యితరబోధనలతో పనిలేదు. గాన కుహినీగారి విషయమైన యీ మూడు సందేహములకును తావు కనుపించదు.

పైనవ్రాసిన యంశములను బట్టి యీ యపక్వాహారాద్వైత సిద్ధాంతము నూతనకల్పితముగాదు గాన కుహినీగారి మీద జయ మనుట అవసరము లేదు. వారి సాహాయ్యముననే పంతులుగారీ పుస్తకమును వ్రాయగలిగినట్లు వ్రాసియున్నారు. అదియే సత్యము. కృతజ్ఞతజూపుట కూడ న్యాయ్యమే.

ఈ గ్రంథమందలి తృతీయాధ్యాయంబున కూనేగారి చికిత్సాక్రమవిమర్శన మందు పంతులుగారు చూపిన లోపములును సరిగావు. ఆరోగ్యవంతుల కాహారవిషయమై స్వాభావికాహారమును సేవించువారి కెవ్వరును బోధించనక్కర లేదు. సృష్టియందలి పిపీలికాది జీవకోటి కెవ్వరు బోధించిరో అట్టి పరమాత్ముడే మానవులకును బోధనకర్త. ఆరోగ్యవంతుడు సైతము 5 నిమిషములు తొట్టి చేయుచుండవలసిన దను విషయము పూర్తియైన స్వాభావికాహారి విషయమై కాదు. అట్టి స్వాభావికాహారి యింతవరకు ప్రపంచకమందేర్పడలేదని నేను చెప్పగలను. ఇక నాపద్ధతియందలి లోట్లు అను వాసిలో మొదటిదైన శరీరమందలి పై భాగమునకు చికిత్సచేయుటవలన అంతరాళభాగములకు చికిత్సకాని లోపమట. అంతరాళమైన నేమి పై భాగమైన నేమి! 'మానినది మందు బ్రతికినది యూరు' అనునట్లు కూనీవైద్యమున కంటె త్వరితముగను, సూఢిగను జవా బిచ్చువైద్య మింతవరకు కని

పించదు. ఈ వైద్యమునందు నాడులకు కేంద్రములైన పొత్తికడుపు, లింగాగ్రములకు చల్లదనము గలుగజేయుట వలన సమస్తనాడీసమూహములు బలమును జెంది అన్య పదార్థమును నెట్టివేయుటకుగాను చేయుశరీరప్రయత్నము నకు తోడ్పడి, శీతలోపచారములచే పొందిన ద్విగుణీకృత మగు బలముతో అన్యపదార్థవిమోచనము చేసి ఆరోగ్య మును గలుగ జేయుచున్నవి. కూనేగారు తమవిధానముచే నితరవైద్యవిధానముల కన్న తొందరగాను, రూఢిగాను, ఆరోగ్యము గలుగజేయుదు మని అన్నిరోగముల విషయము లోను దృష్టాంతపూర్వకముగా విశదపర్చియున్నారు. అందుచే నాడీకేంద్రములకు చేయు చికిత్సయగుటచే అంతరాళములకు దగ్గరమార్గముగాని దూరమార్గముగాదు. ఇంతకంటె త్వరి తముగ గుణ మిచ్చుచికిత్స యింతవరకు లేనట్లు నిష్పక్షపాత బుద్ధితో నూహించువారి కెల్ల విశదమే! "ఈ కూనీ చికిత్స వలన పదార్థనిర్గమ మగునుగాన శరీరపుష్టివిషయమై ఆలో చన జరుగలేదనియు, కూనీచికిత్సవలన ఆరోగ్యమును పొంది నవారు బక్కచిక్కినట్లు కనబడుదురు గాని దృఢకాయుల వలె కనిపించుట లేదు." అను విషయమునకు జవాబు. శరీర మందు చేరిన దొంగవంటి యన్యపదార్థమును నెట్టి వేయుట అవసరమను సంగతి అందరకును సమ్మతమే గదా! ఇక దార్ఢ్యముగా నున్నట్లు కనబడలే దని పంతులుగారు చెప్పుట ఆశ్చర్యమైన విషయము.

ఆరోగ్యమైన పశువు మనుష్యులచే పెంపబడు వానిలో ఈగ వాలిన జారిపోవునట్లు క్రొవ్వుగలది గాదు. బలము వేరు, మనకు పైకి కనబడు స్థూలకాయము వేరు. మనుజుడు చేయు పనిని బట్టి శరీరలావణ్యము, కండరదృఢత లేర్పడును. పని పాటలు చేయు జాతులీ వైద్యమును చేసి యారోగ్యవంతులైన వారికాయములు దృఢముగా కనిపించును. కూర్చుండి తినువారి కట్టి దృఢకాయము లేర్పడవు. ఒకవేళ శరీరము నునుపెక్కి బలిసిన అనారోగ్యమని మన మెంచవలెను. అపక్వాహారమువలనను గూడ ఇట్టి రూపమే యేర్పడును. శరీరపరిశ్రమ లేనితిండి రోగమునే పెంచును. ఆరోగ్యవంతులైన తోట్టివైద్యావలంబకుడు ఇతరులకంటె శరీరబలమందు తీసిపోడు. ఎట్లు కనిపించిన నేమి ? గాన తోట్టివైద్యము కూనీ మహర్షిచే లోటుపాట్లు లేకనే సవరణలుగాని వృద్ధిక్షయములు చేయ వీలులేని సంపూర్ణమైన సత్యచికిత్స. సత్యము త్రికాలాభేద్యము గాన మార్పుల నోరదు.

# శరీరపరిశ్రమము.

## మహాత్ముల యభిప్రాయము.

[శ్రీ రాజయోగాశ్రమము, మునులతోట.]

రాజాధిరాజులచేత రాజర్షియని పేరువడసిన పావన చరితుడును, మానవుల కందరకు ఆదర్శప్రాయుడు నగు శ్రీ శ్రీ శ్రీ స్వామివివేకానందులవారీవిధముగా నుడివియున్నారు.

"సమస్తవిషయముల కంటెను ప్రప్రథమమున మన యువకులు మహాబలాఢ్యులై యుండవలయును. మతము తద నంతర మదియే వచ్చును. ఇదియే నేను మీకు గావించు దివ్య ప్రబోధము. గీతాపఠనముకంటె మీశరీరవ్యాయామము వల ననే మీ రతిశీఘ్రముగా మోక్షసామ్రాజ్యమును బడయ గలరు. మీమేను కండరములు బలిసియున్నప్పుడే మీరు గీతారహస్యమును జెచ్చెర గ్రహించ సమర్థులయ్యెదరు. పరి శుద్ధమగు వేడిరక్తము మీనాళ్లయందు ప్రవహించుచున్న ప్పుడే పరమేశ్వరుండగు శ్రీకృష్ణభగవానుని మహత్తర లౌకికసమర్థాతిశయమును, తన్మహాబలాఢ్యతత్త్వమును దెలియ శక్తుల రయ్యెదరు. మీరు శక్తికలవారలై, మీనిజపాదముల మీద దృఢముగా నిలుపబడగలిగినప్పుడే, సుపనిషత్సారమును ఆత్మవిజయమును బడయ సమర్థులయ్యెదరు.

స్వామి వివేకానందుని కంటె గొప్పవ్యక్తియని పేరు బడసినటువంటివిన్ని, తానే భగవానుడ నని ఖండఖండాంతర ములయందు చాటినటువంటి మహాశయుడును, యోగపురు షుడునగు శ్రీ శ్రీ శ్రీ స్వామి రామతీర్థ యీాదిగువ విధమున నుడివినాడు.

"ప్రతిమానవుడు త్రివిధమగు శక్తుల నార్జించు టావ శ్యకంబు. ఆత్మజ్ఞానమును బడయ నుంకించుటకు పూర్వము దైహికశక్తి బడయుట విధియై యున్నది. శారీరక, మానసిక, దైహిక శక్తులే త్రివిధమగు శక్తులు. ప్రథమంబగు శరీరశక్తి సాయంబు లేనిదే యన్యశక్తిద్వయము లభ్యము కానేరదు.

ద్వితీయ తృతీయశక్తులు ప్రథమంబగు శరీరశక్తిమీదనే యాధారపడియున్నవి. ప్రథమవాచక పుస్తకము పఠింప నేరనిదే బాలు డెట్లు నీగాఢంబులగు వేదాంతగ్రంధముల బఠించి జీర్ణము చేసుకొనగలడు?

మరియు బుద్ధభగవాన్, శ్రీరామకృష్ణ పరమహంస, మహాత్మాగాంధి మున్నగు మహాశయులు శరీరమును కడు జాగ్రత్తగా కాపాడుకొనవలసినదని చెప్పియుండ, ఈనాటి స్వాములు శరీర మొక పుండనియు దానిని లక్ష్యముచేయవల దనియు నతిగంభీరముగా నుపన్యసించుచుండిరి. అందు వలన వారు పలుకష్టములు పడుచు నితరులనుకూడా కష్టముల పాలుచేయుచున్నారు. శరీరమునుగూర్చి తగుశ్రద్ధ తీసుకొనక పోవుటచేతనే నానావిధరోగములకు గురియగు చుండిరి. మరియు చేతులార తెచ్చుకొనుచు నిందమట్టుకు ప్రారబ్ధకర్మమీద మోపుచుండిరి. కాని పాపము! కష్టములు వీరు కాక అన్యులు పొందరైరి. కనుక పాఠకమహాశయులారా! యిందలి సత్యమును మీరలే యోజించుకొని మీ కేది సమంజసముగా నున్నదానిని చేపట్టి సుఖించెద రని యెంచి యీ కార్యము మీహస్తములయందే వదలుచున్నాడ.

---

## పీనసరోగము.

ప్రాతఃకాలమునను, రాత్రియందును చల్లని నీటిని త్రాగి పరుండిన మూడు దినములలో పీనస శమించునని 'కృషీవలుడు' అనుపత్రిక వ్రాయుచున్నది.

## పొడుము.

మన దేశమునకు సాలీనా రు 17,28,822,85 ధననష్టము కలుగుటయే గాక, జనులు వివిధములగు రోగముల పాలగుచున్నారు. —కృష్ణాపత్రిక.

## క్షయరోగలక్షణములు.

1 దేహదార్ఢ్యము తగ్గుట, 2 స్వప్నములు, 3 అకారణముగ శుక్లము నష్టమగుట, 4 సాయంకాలమున జ్వరము తగులుచుండుట, 5 దగ్గు వచ్చుట, 6 గొంతువెంట నెత్తురుపడుట, 7 క్రమక్రమముగా తూకము తగ్గిపోవుచుండుట.

## దుస్వప్నము లేల గలుగుచున్నవి?

సులభముగ జీర్ణమునకు రాని ఆహారపదార్థములను భుజించుట, పొద్దుపోయి భోజనము చేయుట, అజీర్ణవ్యాధియున్నపుడు టీ కాఫీలను గూడ త్రాగుట మున్నగువానివలన.



## మా వద్ద వెలకు దొరకు గ్రంథములలో కొన్ని

## మొత్తము 65 గ్రంథములు.

---

### సూర్యకిరణచికిత్స.

సునిశితవైద్యము — సూర్యకిరణచికిత్స — వర్ణచికిత్స

ప్రోథప్రభాకరము — వర్ణవైద్యమంజరి — వర్ణవైద్యము 1,2 భాగములు.

### జలచికిత్స.

లక్ష్మణజలచికిత్స — స్వాభావిక చికిత్సా — ఉషఃపానము

నెప్పీయజలచికిత్స — నియమములు — రక్తపరీక్షాళనచికిత్స

తొట్టిస్నాననియమములు — జస్టుచికిత్స — కూనేమహర్షి చరిత్రబోధ

వేడినీటికాపు — తొట్టివైద్యము — రక్తశోధనచికిత్స

### ఇతరచికిత్సలు.

ఉపవాసచికిత్స — యోగచికిత్స — క్షీరచికిత్స

ధ్యానచికిత్స — పంచామానచికిత్స — జంబీరచికిత్స

### వ్యాధులకు చికిత్సలు.

1 క్షయ, 2 మలబద్ధకము, 3 శుక్లనష్టము 4 ప్రాకృతచికిత్సార్ణవములు (7 భాగములు) (వీనిలో అన్ని వ్యాధులకు అన్నిరకముల చికిత్సలును తెలుపబడును.) 5 దీర్ఘరోగచికిత్సాసారము

### ఆహారము మీద పుస్తకములు.

1 నిర్వికారభావిజీవనము (కొబ్బరినిగూర్చి) 2 పచ్చితిండివలనిప్రయోజనములు 3 అపక్వశాకాహార అద్వైతసిద్ధాంతము 4 ఆహారము (2 భాగములు) 5 సమరసాహారము,విరుద్ధాహారమిశ్రమము 6 ఆహారసమ్మేళనపుగోల.

ఇంకను ఆరోగ్యవిషయములమీదను వేదాంతముమీదను పుస్తకములు కలవు. పూర్తివివరములకు కేటలాగునకు వ్రాయుడు.

---

మేనేజరు, ప్రకృతికార్యాలయట్రస్టు, బెజవాడ.

# సునిశిత వైద్యము

సునిశితములగు జలచికిత్స, మృత్తికా చికిత్స, విద్యుచ్చికిత్స, కాంతశక్తితో చేయు చికిత్స, వర్ణచికిత్స, సూర్యోపాసన, మంత్రచికిత్స, యోగనిద్రాచికిత్స, పవనచికిత్స, భక్తి విశ్వాసచికిత్స మొదలగునవి యిందు విపులముగా వివరింపబడినవి. గ్రహింప సాధ్యముకానివిగా వదలివేయుబడిన అనేక విషయములు శాస్త్రీయముగా వివరింపబడినవి. ఇది డాక్టరు ఈ. డి. బ్యాబిట్, ఎం. డి., ఎల్ ఎల్. డి. గారిచే ఆంగ్లేయ భాషలో వ్రాయబడిన ప్రసిద్ధ వైద్య గ్రంథమునకు డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య, ఎన్.డి., డి. యం. గారి భాషాంతరీకరణము. అచ్చుపూర్తి అయినది. 750 పుటలు. 100 చిత్రపటములు. మంచి డబిల్ క్రౌన్ 28 పౌనుల గ్లేజు కాగితములపై నూతనఫక్కీని ముద్రింపబడినది. మంచి నిండు క్యాలికో బైండింగు చేయుబడినది. వెల రు 4-8-0. నిండుశోలు ఫైగ్జిబిల్ బైండింగు ప్రతి 1 కి రు 5-0-0. పోష్టేజి ప్రత్యేకము. ప్రకృతిచందాదారులకు ప్రతికి రు 1. చొప్పున తగ్గింపు. గ్రంథ విషయసూచిక కోరినవారికి పంపబడును.

మేనేజరు,

ప్రకృతి కార్యాలయ ట్రస్టు - బెజవాడ.